శ్రీరాము నాత్మలో చెలఁగేగుమన్న
వైరాగ్య మింకైన ధారుణీబాల
యెఱుఁగంగలేక ఆ నవ్విధియెల్ల
తిరుగుచునుండె నే యరిమురి లేక

---

## శ్రీరాముఁడు సీతను త్యజించుట

కడుసంతసమ్మయి కాల మీరీతి
పురమునపై వారికి గడచుచు నుండ

లోకులు కాకు లేకేకువ లేక
వాకొంద్రు నోటికి వచ్చిన యట్లు
పరవాసమం దొకవత్సర మున్న
తరుణి సీతనుఁదెచ్చి మరల శ్రీరాముఁ
డేలుచున్నాఁ డంచు నవటనో యొవఁడో
యాలోచనము లేక అనినట్టి మాట
వినవచ్చె రాముని వీనులయందు
సునిశితశూలముల్ జొనిపిన యట్లు
జనకజ దూకిన జ్వాలదగ్నిశిఖలు
తనకన్నులందుండి తరలనే లేదు
సీత పాతివ్రత్యశీలమ్ము నెల్ల
వీతిహోత్రుఁ డెఱుంగు విశ్వమెఱుంగు

కాని లోకులు పల్కు నిందావాక్యముల
సువంశ విభుడు తా నుల్లమ్ము నందు
సైరింపఁ జాలఁడు క్షణము రాముండు,
కాన యట్లున్నచో ధర్మ మే యగును,
కాన యట్లున్నచో ధరకి యేమగును !
ఎపదయుందలి ప్రేమనెల్ల నణంచి
తపియుచు తన రాజధర్మమ్ము నెంచి
జవదాటు నపనింద సైరింపలేక
తనసీత నెబాయఁ దలఁచె రాఘవుఁడు

మోహమున నొకచింత గ్రమ్మికొనంగ
సౌమిత్రి కెఱిఁగించి జరిగిన దెల్ల
అడవిలో వాల్మీకి యాశ్రమస్థలిని
కడువడి సీతను విడచిరమ్మనుచు
వాదమ్మునకు తావు వదల కావంత
ఏమిది ఏమిది యెంత ఘోరమ్ము
భూమిజన్ ద్యజియింప రాముఁడు తలఁచె
రాముఁడే పలికెనా యీమాట లెల్ల
సౌమిత్రి కడయించె సందియ మ్మెదా.
రామునియాజ్ఞలో రగులు తీవ్రతకు
సౌమిత్రి నిలువున చలియించిపోయె
పిడుగులు తలమీద పడుచున్నరీతి

కొట్టుకోసాగెను గుండె జానకికి
అడవిదాకలఁ బట్టి నడచి సారథియు
కడువేగ చేరెను గాంగతీరమ్ము
దిగె లక్ష్మణుండును దిగెను సారథియు
దిగి ఏదో కీడని దిగులుతో సీత
"ఏమయ్య లక్ష్మణ! యేమైన దోయి
ఏమి దీనుఁడవయి యిట్లుంటి వనియె
విఱిఁగిపడ్డది మిన్ను శిరమున నంచు
నెఱుఁగదు పాప మాయింతి సీతమ్మ
చెప్పకపోలేక చెప్పగాలేక
తప్పించుకోలేక తలమీది బరువు
వదనమెత్తగలేక వాల్చి లక్ష్మణుఁడు
వదినకాళ్ళకు మ్రొక్కి వచియించె నిట్లు

"ఓయమ్మ జానకి! ఓ మహాసాధ్వి!
నాయందు దయబూని నన్ను క్షమింపు,
శ్రీరామునాజ్ఞను మీఱగాలేక
ఘోరమంచును నాదు స్వాంతమం దెఱిఁగి
కొనివచ్చితిని నిన్ను వనవీధి కిటుల
వినిపింపగా నొక్క వెసిదావు వార్త.
పరవాసమందున్న పడతి జానకిని
మరల రాముండేలె ధరణి నటన్న

పరు లాడుచున్నట్టి పరుషవాక్యములు
భరియింపఁగాలేక పరితాపమంది
రాముఁడు వేగమె రమణిరో! నిన్ను
నడుమటవిలోన నేకాకి గాఁగ
విడచిర మ్మనఁగ నిన్నడవి కీతి
తమయుఁడ తెచ్చిన కడుపాపి నేను,
ఈకానన మ్మెడ సాకేత మెడ
ఏకాకివై యిచ్చ టెటులుండువమ్మ!
ఎవరు సఖిజను లెవరు బాంధవులు?
ఎవరు దిక్కిచట నీకెల్లవేగెదవా
పరనింద వినలేక వదలెనే కాని
మొఱఁగఁడే శ్రీరాముఁ డెదలోన నిన్ను,
దారుణారణ్యమే తల్లి! నీయిల్లు
కూరిమి చుట్టాలు క్రూరజంతువులె
అనియేమొ లక్ష్మణుం డనువాక్యములు
వినలేక జనకజ విస్మృతిం గొనియె
వ్రేలినవా వేయుపిడుగులు తలను!
వ్రీలినదా క్రింది పృథ్వీతలమ్ము!
తలగొట్టినట్లాయి తాలిమి తూలి
నెలలు నిండిన తల్లి నిండుచూలాలు
"నాతల్లి భూదేవి నను గావు మనుచు

భూతలమ్ముఁ బడి సీత మూర్ఛిల్లె
తెలివొంది లక్ష్మణుం బిలిచి దీనముగ
పలుకుల్ల నిట్లని పలికె జానకియు
కనులందు నశ్రువుల్ కాల్వలై పార
జనులెల్ల వణఁకొంచు దూరదశ లాశ.'

"వినవయ్య లక్ష్మణ! వినవయ్య తండ్రి
ఇనివడి నాకేమి వసుధపై మిగిలె,
నారాముఁడే యిట్లు నన్నుఁ ద్యజింప
ధారణి నన్నింకఁ దలఁచువారెవరు!
విడలేక రాముని వెన్నంటి యేగి
అడవులఁ దిరిగితి నగ్ని దూకితిని
చాలవు గ బోలు జగతి నీపాట్లు
ఆలింప రెవరింక పాలింప రెవరు.
నాగతి యిటులుండ నీవేల తడయ
వేవేగ లక్ష్మణా వెనుకకు బొమ్ము
అడవిలో సీతను విడచి నాననుము
ముఁకపుకుల్లరకు నాకొకసారి మాట—
బత్తితో రామునే ప్రార్థింతు ననుము
అత్తల ముగ్గుర నడిగితి ననుము
మునివసిష్ఠులకును మ్రొక్కితి ననుము
మనబంధువులనెల్ల మఱవలే ననుము

తలపుఁ రామునే సలిపెద ననుచు
ఇలనెల్ల దయతోడ నేలుచో మ్మనుచు
రారాజు జనకుని గారాముతనయ
కూరిమితోడలు కోసలేంద్రునకి
భూపుత్రి శ్రీరామభూపాలు పత్ని
ఏపాప మెఱుఁగని యింతి యానీత
దీనురాలై యిల్లు దిక్కు లేకుండ
కానలయందున కలసిన దనుమ"
పలుకుచు తనలోని తలఁపుల నెల్ల
విలపించి విలపించి విలపించ లేక
దరి లేని శోకాన ధరణిజ వాలి
మఱుమాట లేకుండ మరల మూర్ఛిల్లె
భూవలయమెల్ల పూజింపఁ దగిన
దైవస్వరూపిణి ధరణిమూర్ఛిల్లె,
కుటిమీద నింక నీ సీతాలతాంగి
బ్రతికియుండిన మాట ప్రాణాలతోడ.
పాప మాతడువులో పసికందు వెట్లు
సైపుచుండెనో యీమె సంతాపబాధ,
తలఁచినకొలఁది నాతల్లి దుస్థితిని
నిలువున తనగుండె నీరయి పోయి
ఏమి మాటాడుటో ఏమి చేయుటయో
సౌమిత్రి యెఱుఁగక చలితచిత్తమున

కన్నీళ్ళు ప్రవహింప కళ్ళువదలక
క్రన్నన జానకి కాళ్ళకు మ్రొక్కి,
"కావరే నాతల్లి జానకి నిచట
కాననమ్ముల డించి నేనేగుచుంటి,
పంచభూతములార పక్షీంద్రులార
అందితోరగులార అర్కేందులార
తరులార గిరులార తారకలార
వర మునీశ్వరులార వాహినలార
దేవతాతతులార దిక్పతులార
కావరే సీతను కరుణతో ననుచు
విడలేక సీత నావిపినమధ్యమున
విడనాడి దీనుడై వెడలె లక్ష్మణుడు.

ఊరికి మఱునాడు రయింటిగా వచ్చి
ద్వారమ్ముకడ నున్న తమ్ముని జూచి
చూచెను రాముడు శూన్యమా రథము.
ఏచ నేబాధయో యాచిత్తమందు,
ఎండిన కనుదోయినుండి రామునకు
కెంపశ్రువులు రాలి పృథివిపైఁ బడియె
తన బహిఃప్రాణమ్ము ధరణిజ లేని
తనువేల బ్రతుకేల ధారుణి యేల.

జీవిత మ్మెల్ల శూన్యసీమయై గడచె
భావమందున రామభద్రున కపుడు.

సీత లేదను వార్త శీఘ్రమ్ము ప్రాకి
చేతమ్ము లెల్లను చెదరిపై పోయి
భోరున నేడ్చిరి వారింప రాక
పౌరులు బంధువుల్ పరివార మెల్ల

---

## సీతా పరితాపము

అవనిజ శోకమ్ము నరయంగ లేక
అవని జీవమ్ము సర్వ మాగినట్లయ్యె
తరువులు తలవాల్చె గిరులు చెమర్చె
పరువులెత్తవు లేడి పక్షిసంతతులు
క్రూరమృగమ్ములు గుహ లందె నిలిచె
పారదు గంగాప్రవాహమ్ము కదలి

లేడు లక్ష్మణుఁ డట లేదు రథమ్ము
ప్రోవయి మిగిలెను భూమిజ యొకతె.
విలపించినను గూడ వినువారు లేరు
పలుకువారును లేరు పిలచినప్పటికి.
అంతయు శూన్యమౌ యవనిజ కపుడు

అంతయు మాయ యాయవనిజ కపుడు.
జనకుని యింట తా జనియించె నపుడు
తనకయి రాముఁడు చనుదెంచి మిథిల
శివధనుర్భంగము చేసె నేనాఁడు
అవనిపై నీనాటి శాశత యెల్ల
తెలియని యొకవింత దృశ్యమై మదిని
కలవోలె కనుపించి కదలపాగినది
ఆరక్కసుల మధ్య నణఁగి మణంగి
యేరీతి రామునే యెడద నిల్పినవా
తనమానస మశోకవనసీమ యెఱుఁగు
మానమూలెఱుఁ గెఱుఁగు నాయగ్నియే యెఱుఁగు
తనమనోదైవమ్ము తనప్రేమమూర్తి
తనరాముఁడే యిట్లు త్యజించి నపుడు
పుతమి నిప్పుడు తనకడుపునఁ బడిన
బడుగులకై గాక పతి దరిలేని
శ్రీమీఁద నవగిక్కై బ్రతుకంగ వలెనా
మతిఁ దోచ కచటనే యతులదుఃఖమున
అవశయై పడియున్న యవనిజం జూచి
దివినుండి దేవతల్ దీవించి నారు.

## సీత వాల్మీకి ఆశ్రమము చేరుట

మునిసుతుల్ కొందఱా వనవీధి వెంటఁ
జనుదెంచి పండ్లకై జాడకిం గాంచి
అవనీతలమ్మున్న అవశయై యిటుల
ఎవరీమె పడియున్న దీనాఙ్గి యిచట
చూడగా దుర్భర శోకమ్ము వలన
వాడిపోయిన దీమె వదనమ్ము గాని
ఏదివ్యభామయో యేతెంచినటుల
దేదీప్యమాన మీ తేజ మ్మటంచు
వెఱగంది యావార్త వెంటనే వారు
పరువెత్తి చెప్పిరి వాల్మీకి మునికి
అంతరంగమ్మున నామునిచంద్రుఁ
డంతయు పూర్తిగా నరసి వేవేగ
జనకజ యున్నట్టి స్థలమున కేగి
మునికాంత లర్ఘ్యమ్ముఁ గొనితేర వెంట

ఎవ్వరో తనకడ కేతెంచినట్టి
సవ్వడి నాలించి జానకీసతియు
మునివర్యుఁ గని తనమోము పైకెత్తి
వినయమ్ముతో మ్రొక్కి విలపించసాగ
అనునయించుచు సీత కర్ఘ్యమ్ము నొసఁగి
మునిపతి లోపచర్య లొనరించుచుంత

వాత్సల్యమునఁ బల్కె వాల్మీకి యిట్లు
"వత్సరో! వినుము నేవాల్మీకిమునిని
ఎఱుఁగుదు నీకథ జరిగిన దెల్ల
వెఱఁగంది నీయిట్లు విలపింప కమ్మ!
రాముఁ డెఱుంగఁడే నీమాన్యచరిత
భూమిపై వసనిందఁ బొందగా లేక
వనవాటికలకు నిన్నంపెనే గాని
మనసు నీమీఁదనే మసలు నాతనికి
పరమపవిత్ర మీవాహినీతటిని
అనయము మర్యాదియై నాయాశ్రమస్థలము
చల్లనినీడల జపతపోవ్రతము
లుల్లాస మొసఁగు నీయుల్లమ్మునందు
మునిపత్ను లున్నారు మునిసతుల్ కలరు
మనమున సందియం బందకుమమ్మ
అకలంకమర్యాద లమరి యెల్లపుడు
సకలోపచారముల్ జరుగు నీకిచట
ననుఁగూడ మీతండ్రి జనకునివలెనె
మనమున భావించి మాతోడ నేగ
అరుదేర మమ్మ నీవిఁకవును మాని
జరగును శుభము లాస్థలమందు నీకు
ననుచు నామౌని తనయాశ్రమమ్మునకు
కొనిపోయె సీతను కూర్మి మీఱంగ.

సీత కాయాశ్రమ సీమ చేరగనె
వేళమ్ము వంగాన చేకూరె కాంతి
జనకజ కేలోటు కన రాని రీతి
మునిసతుల్ పరిచర్య నొనరించుచుండ్రి

---

## లవకుశల జననము

రామునే మనమున వేమారు దలచి
రామునే పూజించు భూమిజ సతము
ముని యాశ్రమవాస జనులెంగు టాది
జనకజ చరియించు మనిశాంతవేళ
రవికుల దైవమ్ము రంగనాథునికి
ప్రవిమలభక్తితో ప్రార్థనల్ సలుపు
మెలమెల్లగా గాంగజలములు దెచ్చి
చెలువారు పూవులచెట్లకు బోయు
ప్రతిపొద్దు బిలుచును పికశారికలను
లేతపచ్చిక లేరి లేళ్ళకు మేపు
ఆనందమై పొల్చె నంతకంతకును
జానకి గర్భస్థల జీవనమ్ము
జానకి కొకరాత్రిసమయమ్మునందు
కానుపునొప్పులు క్రమముగా వచ్చి

సభయున నగ్రహారాది విభవమ్ము లలర
శుభరాశులందుండి శోభిల్లుచుండ
ఇనకులోద్ధారకు లిరువురు సుతులు
జనియించి రామొకు సౌందర్యనిధులు.
రాముని బోలిన రమణీయసుతుల
నా మోదమునఁ జూచి యవనిజ యలరె
మునిరాజు వాల్మీకి చనుదెంచి వేగ
ఘన యశోబలములు కలుగుగా కనుడు
కుశలవమ్ములతోడ కూర్మి దీవించి
కుశలవులను పేర్ల శిశువుల కిడియె.
రవిచంద్రతేజులు రమణీయతనులు
ప్రవిమలాకారు లాబాలు రిద్దఱిని
మురిసిపోయిరి చూచి మునిపత్ను లెల్ల
అనుదెంది దీవించి రాశ్రమ మునులు

---

## ల వ కు శు ల బా ల్య ము

సీతమ్మ కథల మాశిశువులే యిపుడు
సీతమ్మ బ్రతుకెల్ల శిశువులే భువిని
ప్రీతిగా కంటికి ఱెప్పలవోలె
సీతమ్మ పెంచె నా శిశువులఁ జూచి.

మునివాటి కొత్తక్రొత్త మురువు దీపింప
మునిబాలకులతోడ చనవుగా కలసి
మునికుల మంతకు మోదమ్ము గూర్చి
దినదిన వృద్ధిగా తేజమ్ము నంగి
సురుచిర సద్గుణ సుందరు లగుచు
పెరిగి యాబాలురు పెద్దవా రైరి

లవకుశు లిద్దఱున్ లలితధీయుతులు
ప్రవిమలభక్తితో వాల్మీకి వద్ద
పలుశాస్త్రముల నేర్చి పండితు లైరి.
విలువిద్య గడియించి వీరులై నారు
గానవిద్యల గొప్పగాయకు లైరి
వీణఁ గొని వారు గానమ్ము సల్ప
మేనులు పులకించు తేనెలే కురియు,
మానిత నవకళామాధుర్య మొలుకు.
తన కనుపండువై జనియించి యిలను
ముని తపోవనులందు ముద్దుగా పెరిగి,
వీరులు ధీరులు విమలసద్గుణులు
శ్రీరాముని యశమ్ము క్షితివిూద నిలుపు
సుహితవర్తను లని మన్నన లంది
బహువిధప్రజ్ఞలై వరలుచు నున్న
సురుచిరమారు లాసుతులనుఁ జూచి

పూలతేరులయి జాలువాలినవి
కలువ వెన్నెలలయి జగమునిండినవి
ఇలయెల్ల శ్రీరామునిలయమ్మై వెలసె

---

## శ్రీ రా ము ని ని ర్వే ద ము

జనకజన్ వీడిన సమయమ్మునుండి
మనమున రాముని కలవరలిమ్మ
జానకిరూపమ్ము కానంగ వచ్చు
జానకిమీదనే చరియించు గలఁవు.
నెలలు తొమ్మిదియును నిండిన యబల
పలురాళ్ళపై నాడు పడియున్నయపుడు
ఆ సీతగొంతులో నవని నేరైన
పోసినప్పటి మాట పుడిసెడు నీళ్ళు
కోమలహృదయ ఆ కుసుమాంగి సీత
యేమని తలఁచెనో రామునిఁగూర్చి
ఆవేళ తనవెంట నడుదెంచ నంతె
పోవఁగా లేదాయె పుట్టింటి కెపుడు
జానకి యేదని జనక రా జడుగ
కానేమి వచియించి తప్పుకోఁ గలఁడు

రాచకార్యము లెట్లొ రయమునఁ దీర్చి
యోచించు శ్రీరాముఁ డొంటిగా నిల్చి

తనహృదయేశ్వరి తనప్రేమరాశి
తనబహిఃప్రాణమ్ము తనసీత యిపుడు
తననుండి దూరమై చనుచున్న యటుల
మనమందుఁ దోఁచి పట్టనిపించి తనకు
నిలుచున్నకాఁ డల్లి నిలుచుండిపోవు
పలుకఁ డెవ్వరితోడ పిలువఁ డెవ్వరిని

---

## శ్రీరాముఁడు సోదరులకు రాజనీతి బోధించుట

రాయిడి నొందెడి రాము నెమ్మొగము
పోయి చూడఁగలేక ముగురు తమ్ములును
జానకి పాల్పడ్డ సముఖునో యనుచు
దీనులై మనముల దిగులు నొందెదరు.
మనమున శాంతికై మాటి యేమిటకొ
విశేషంపు తమ్ములన్ బ్రీతితోఁ బిలిచి
శ్రీరాముఁ డప్పుడప్ప చెప్పుచు నుండు
నేరాజనాథునో యేనీతి కథలొ
రాజ లేరీతిగా భూజనమ్ములను
రాజధర్మమ్మున రక్షింపవలెనో;
ఈయుర్విపాలన మెట్లుండవలెనో

న్యాయనిర్ణయ మెట్లు చేయంగవలెనొ
ఆదరమ్మెవేళ నాగ్రహమ్మెపుడు
మేదినీపతి చూపు మెండుగాగవలెనొ,
తమ్ములకు రాజ్యతంత్రమ్ము నెల్ల
నిమ్ముగా బోధించు నెల్లు రాఘవుఁడు.

---

## శత్రుఘ్నుఁడు లవణాసురుని సంహరించుట

వినవచ్చె నింతలో విపరీత మగుచు
దశజాలబాధలు ధరణిని మరల
మధురాపురికి రాజు మధుదైత్యసుతుఁడు
పృథివి కంతకు పెద్దబెడదగా ప్రబలి
లవణాసురుం డొకఁ డవనిపైఁ దిరుగు
భువిని తానొక్కఁడే మొనగాఁడ ననుచు
రావణుమేనల్లుఁ డావీరుఁ డపర
రావణమ్మనఁగిన కడుదుష్టుఁ డతఁడు
మునులు వచించి రాదనుజుని వేగ
దనుజువాడుచే భూమి కనుకూల మగుచు
తనతండ్రి జీవించు దినములనుండి
తనగృహమ్మందున తినరు చున్నట్టి

శివునిశూలమ్మందు చేబూని లవణుఁ
డవని నజేయుఁడై యనిసేయుచుండు
ఇనకుల తిలకు నాయనుపమబలుని
దునిమె మాంధాత నాదుష్టదైత్యుండె

లవణుని దుర్మార్గ లక్షణమ్మెల్ల
చెవియొగ్గి యాలించి శ్రీరాముఁ డంత
అనుపమ యోధుఁడు తనవినతమ్ము
ననిపె శత్రుఘ్ను నాదనుజునిఁ ద్రుంప
సమధికవీరుఁ డాశత్రుఘ్నుఁ డంత
సమరసన్నద్ధుఁడై చనుచు పోరికిని
విశ్రాంతికొఱకయి వెడలి వాల్మీకి
యాశ్రమమందున నాగ నారేయి
జనకజ సుఖముగా కనియె నానాఁడె
మునియాశ్రమమ్మున తనయు లిద్దఱిని
జనకజా గూర్చిన సంతోషవార్త
వినిన శత్రుఘ్నుఁడు మనమున నలరె

జనకజ కుశలమ్ము వినిన యంతటన
ఇనుమడించిన బల మ్మెసఁగి శత్రుఘ్ను
డరిగెను వేగ మా యసురునిఁ జంప
మఱునాఁడె పయనమై మధుపురమ్మునకు.

అరిగి శత్రుఘ్నుఁ డాపరిసరమ్ములన
వారుని శూలము తనకరమందు లేక
తిరగాడు లవణుని త్రిలకించి తనకు
సరియైన కాల మిదియనుని తలఁచి

"ఓ లోకకంటక ! నిన్ను బోకార్చుటకె
నీకడ కనుదెంచి నిలిచి నాఁడిచట
పోటుబోకా! యింక పారిపోలేవు
పోరిలో నిన్నదే పొలియింతు" ననగ
తనశూలమును వెంటఁ గొనిరాని పనికి
మనమున లవణుఁడు వనరి యొక్కింత
సమరమ్మునకు వచ్చి శత్రుఘ్ను తోడ
సమధిక రోష వేషావేశుఁ డగుచు.

ధారుణి కంపించు తీరున రేగి
ఘోరయుద్ధమ్మయ్యె వారి కిర్వురకు
విహరించి దుర్వార వీరుఁడై యునిని
బహువిధ శస్త్రాస్త్ర శాతాగ్నిఁ గురిసి
అచలిత సాహసబలాధిక్య మలర
హతమార్చె శత్రుఘ్నుఁడా దైత్యవరుని
భూవలయము శోక మూలకఁ ద్రోయు
రావణు నంతటి రణపీఁడ్డైన

లవణుని శత్రుఘ్నుఁ డవలీల ద్రుంచె
నవని దుర్లభ మిట్టియతిశయ మనుచు
మునులును జనులు నా దనుజాని మృతికి
మనముల ముదమంది మధుపురమ్మునకు
జననాథుఁ జేసిరి శత్రుఘ్ను నపుడు
వినుతసామ్రాజ్యశ్రీ విభవమ్ము లలర

---

## శ్రీరాముఁ డగస్త్యుని క్రతువు దర్శించుట

ముని యగస్త్యుం డొకముఖ్యమా క్రతువు
నొనరించు చున్నట్లు విని రాముఁ డేఁగి
ముని యగస్త్యునకును మునుల కెల్లరకు
వినయమ్ములో మ్రొక్కి వీక్షించె క్రతువు.

రాజాధిరాజును రాజితగుణుఁడు
భూజనవంద్యుఁడు పుణ్యాత్ముఁ డైన
రాముఁ డీక్షించెను క్రతువునఁ జూడ
భూమీశులం దిట్టి పుణ్యభావమ్ము
లింతటి నయశీల మెఱుఁగ మటంచు
సంతసమంది రాసంయమివరులు
సవనమ్ము లొనరించి చరితార్థు లైన
అవనీశముఖ్యుల వివిధసత్కథలు

రెండుదినమ్ము లాఋష్యాశ్రమమున
నుండి రాముఁడు విన నుత్సాహ మునఁగ
నిర్వహింపగ మునుల్ సంతృప్తులగుచు
సర్వసమ్మతముగ జన్నమ్ము ముగిసె
నవరసకావ్యమ్ముల సరసత మీఱ
దివినుండి యరుదెంచి దేవతల్ గొనుచు
ను నిపుణమ్ముల నెల్ల వృషభామలను
ఘనముగ దీవించి చనిరి జెన్కకను
జనులకు జగతికి సంశ్రేయ మెంచి
మునులు నిస్స్వార్థులై యొనరించు కృతుల
మనుల త్యాగమ్మను మునుల యాశయము
మునుల చరిత్రము మునుల జీవనము
మఱిమఱి మెచ్చుచు మానసమందు
తిరిగి యయోధ్యకు నరిగె రాముఁడు.

---

## శ్రీరాముఁ డశ్వమేధయాగ మొనరించుట

అమరులఁ దనియించి యవని గొలంగు
సమధిక సంపదల్ జన్నమ్ము లనుచు
విశ్వప్రశస్తమై విలసిల్లు యాగ
మశ్వమేధ మొనర్ప నాత్మలోఁ దలఁచి
రాముడు మునులను రావించి నుడువ

ఆమోదమును దెల్పి కులగురు వాసు
తనమంత్రివర్యులు తనసహోదరులు
వెనువెంటనే శాస్త్రవిధి విధానముగ
సకలసన్నాహముల్ సల్పిరి వేగ
సకలసంభారముల్ సమకూర్చినారు
అతిశీఘ్ర మందఱి కాహ్వాన మంపి
క్రతుదీక్షితుం డయ్యె రామచంద్రుడు
వచ్చిరి మునివరుల్ బంధుమిత్రులును
వచ్చిరి రాజులు వానరాధిపులు
వచ్చెను లంకాధిపతి విభీషణుడు
వచ్చినవా రెల్ల తెచ్చిరి ప్రీతి
మణిమయ భూషణ ధనధాన్య మహిత
కనకాంబరాదులు కాన్క లెన్నిటినో
తనవెంట లవకుశుల్ తనశిష్యగణము
చనుదేర వాల్మీకి సంయమి వచ్చె
అకలంక రీతిగా నతిథుల కెల్ల
సకలమర్యాదలు జరిగ నచ్చోట
జవమున లక్ష్మణుం డవనియంతటను
సవనాశ్వమును ద్రిప్పి జయముతో వచ్చె.

రాజితసమ్మాన రమ్యసత్కృతులు
భోజనపంక్తులు భూరిదానములు

ఆ వేత్తు లావిందు లావినోదములు
ఆవేదపారమ్ము లాశ్రితశ్రమము
లాయుత ధర్మనిష్ఠాభ్యాస విధుల
శాకూగతజనాళి కంటిమ్ము లేక
ఆయజ్ఞవేళయం దలరి పెంపార
నాయయోధ్యాపుర మ్మమరధామముగ.



## లవకుశులు అయోధ్యలో రామాయణమును గానము చేయుట

తిరునామ్ముఁ గినుగొని తపసి వల్మీకి
ధరణిజాత్మజులను దరికిరాఁ బిలిచి
"ఎలమి మీరయిద్దరు నేకకంఠముగ
లలితగీతముల నో లవకుశులార!
రాముని చరితమ్ము రామాయణమును
మీమనోహరగాన సామర్థ్య మెసఁగ
రంగారు సాకేత రాజమార్గముల
అంగడులందున యజ్ఞశాలలను
గానమొనర్పుడు కమనీయఫణితి
వీనులవిందుగా వినువారికెల్ల

భూమివాసుల తండ్రి భూపతి గాన
రామునే తండ్రిగా మీరెంచి నది
ఇక్ష్వాకు కులగురుడౌ నెవరు మీరంచు
చెప్పుడు వాల్మీకి శిష్యుల మనగ,
మేలగు గావుత మీకిచ్చె టనియు
కాలుర దీవించి పంపె వాల్మీకి
ప్రవిమలా కారు లా రాముని సుతులు
దివినుండి దిగినట్టి దేవతల్ వారు
జానకీరాముల సచ్చరిత్రమును
వీణల చేబూని వీథివీథులను
రారయ్య జనులార రమణీయమైన
శ్రీరామకథ మీకు చెప్పెదమయ్య,
ప్రవిమలానంద మారామునిచరిత
చవులూరు వాల్మీకిసంయమి కవిత
శ్రీమహావిష్ణు వారామభూనేత
శ్రీమహాలక్ష్మి యావిభుజాత సీత,
అవతారమూర్తు లీమానవిని వారు
అవనిశ్రేయము నెంచి అరుదెంచినారు,
పరిశుద్ధ శాశ్వతుల్ భవ్యసత్కృతులు
కరుణాసముద్రు లానుసుచిరాత్మకులు,
రాముడు రారాజు రాజ్ఞిసీతమ్మ
భూమిపై స్వర్గమ్ము రామరాజ్యమ్ము

చల్లనిదైవముల్ జగతికంతటికి
తల్లిదండ్రులు వారు ధరణి నెల్లరకు
జనకజారాముల సచ్చరిత్రమ్ము
ఒనులార రాకయ్య వినుపింతు మేము"
అనుచు రామాయణ మాద్యంత మచట
వినయసౌజన్య లాబిడ్డలిద్దఱును
గానమాధుర్యముల్ కాల్వలై పార
వీణల చేబూని వినిపించి నంత
తేనెలు వర్షించె తీయముల్ గురిసి
ఆనాఁటియోధ్యయం దన్నిచోటులను.
లాలిత వాక్సుధా వ్యాలోలమైన
బాలుర మాటలో పాటలలోన
వీణతీవలనుండి విశ్వమ్ము నిండి
రాణచెల్వారిన రామనామమ్ము
ఎంతమనోహర మ్మెంత రమ్యమ్ము
ఎంత సమ్మోహన మెంత హృద్యమ్ము
ఆమోదభర సంపదారామ మగుచు
రామమయమ్మయ్యె భూమి సర్వమ్ము
దేవతాదేవుని దివ్యనామమ్ము
పావనమ్ముసగించె వసుధనంతటిని,
సంగీత సాహిత్య సమ్మోద ఝరులు
పొంగెత్తి ప్రవహించె పురవీథులందు,

అవతారమహాత్త్వ లా మునులవక్త్రముల
ప్రవిమలచరితలో బ్రతుకుచే నిండి
పరువెత్తి పురజనుల్ బాలురవెంట
పరవశులైరి యాపాటల వినుచు

ఏమి యీ మాధుర్య మేమి యీగాన
మీ మనోజ్ఞాకారు లెవరు వీ రనుచు
బాలురమాటయే పట్టణమ్మెల్ల
బాలురమాటయే పౌరుల నోట
శ్రీమహనీయ మా రామునిచరిత
మామోదముగ గాన మాలపించుచును
భువనమందర దివ్య మోహనాకృతులు
లవకుశుల్ సుకుమార లావణ్యతనులు
పురవీథులందునఁ దిరుగుచు వేగ
అరిగినంతన రాము యజ్ఞవాటికకు.

తిలకించి రాముఁడు పులకించె మదిని
మొలకెత్తె నేదియో పుత్రభావమ్ము
ఆముగ్ధసౌందర్య మారాజఠీవి
ఆమోముపోలిక లామేనిసొబగు
లాబాలవీరుల యందమ్ము లరసి
నాబిడ్డలే వీరు నవ్యమన్మథులు

మునికి గానంబుగా విని యంది వేగ
కొనియాడ్మ జనకి యనిచెప్పె నపె.

రాముని మాటలు మోదంబు విప్పారి
ఆమోదములరంగ నతిశీఘ్రముగను
సౌమిత్రి వసికేగి యామునితోడ
రామునిమాటల [నుడువు వచించె
శ్రీరాము వాంఛయు సీత కాదనదు
ఆహ్లాదిగా పోవ మానుచు వాల్మీకి
మునిచంద్రుఁ డేగెను ముదమున నవుడు
జనకజం దోడ్కొని సాకేతపురికి.



## భూదేవి సీతను గొంపోవుట

ధరణిపుల్ మునులను పురజను లెల్ల
రరుదెంచిపట్టి యా యజ్ఞవాటికకు
జనకజం గొనివచ్చి సభికులు వినఁగ
వినయమ్ముగా నిట్టు లనియె వాల్మీకి
"శ్రీరమ్యగుణసాంద్ర ! శ్రీరామచంద్ర !
కారుణ్యగుణధామ ! కమనీయనామ !
సౌమిత్రి నుడువంగ నీమాట లెల్ల
ఆమోదమయ్యెను నామదికుండు

కనుఁగొను మయ్య నా వెనువెంట నదిగో
చనుదెంచె సీత నీచరణసేవలకు
భువిమీఁద ధర్మమున్ బొలుపార నిలుప
దివినుండి వచ్చిన దేవుఁడ వీవు
నేనెంతవాఁడను నీకుఁ జెప్పంగ
వినను నావాక్య మాలింపు మొకటి
పాఱుఁ డొక్కఁ డన్న పలుకుల కోడి
ఈరీతి నీభార్య నడఁబాయఁ దగున
భూపుత్త్రి యీసీత పుణ్యచారిత్ర
ఏపాప మెఱుఁగని దీయింతి వినుము
కొలువంగలేది ఈలలితాంగి కీల
మలనాఁడు లంకలో నగ్నిదేవుండె
నీమాటకోలఁది యాసౌమిత్త్రి వచ్చి
భూమిజన్ విడనాడి పోయిన యపుడు
జానకి నొంటిగా కాననవీధి
నానాఁడు జూచి నాయాశ్రమస్థలికి
అనునయించుచు చాల నాదరమ్మునఁగ
కొనివచ్చినా రయ్య మునికాంత లరిగి.
లవకుశు లీకవ లవనీంద్ర! కనుము
ప్రవిమలాకృతులు నీబాలుర వీరు.
పెరిగిరి నాకడ పెద్దవా రైరి
సురుచిర సద్గుణ శోభితుల్ వీరు

చేకొనుమయ్య నీచిఱుతగొలకుల
జనులుహర్షింతురు జగము హర్షించు
మునులును హర్షమ్ము పొందుదు" రనఁగ

శ్రీరాముఁ డంతట చేతులు మోడ్చి
పౌరులెల్లరు విన వాల్మీకి వినఁగ
"అనఘాత్ములార నాకాత్మలోఁ దెలియు
జనకజ నిర్మలసౌశీల్య మెల్ల
మునిచంద్రుఁ డిట్టుల వినిపించు కంటె
జనులమధ్యమ్మున శపథమ్ము జేసి
జనుల కింకొకసారి తనప్రవర్తనము
జనకజ తెలుపుచో చాలమే" లనియె.

మరల నిట్టి పరీక్ష ధరణిజ కేల
జరిగిన దెల్లను చాలదా యనుచు
జనులెల్ల శ్రీరాముఁ డనిన వాక్యములు
విని మనమ్ములయందు విభ్రాంతు లైరి

పలువురి ముందున నగు బాటు గాఁగ
తలగొట్టి నట్లయ్యె ధరణిజ కపుడు.
చెచ్చెర రావించి శ్రీరామవిభుఁడు
రచ్చకీడ్చుట లేల రాపాడు టేల !
ఈ పరీక్షలు తన కింకెన్ని కలవో ?"

భూపృష్ఠము నిచె 'భూమిపై లేవదు
నాల్గువైపులు టవే లెక్క కన్పడెదూ
ధరణిపై లనతేక స్థానమ్ము లేదా
జనులు సంభ్రమించి మునులకు మ్రొక్కి
అనపహంద దము లో కనుల ముద్దాని
కనుదోయి అశ్రువుల్ కాల్వలై పార
తనయులన్ కడసారి గదిని ముద్దాడి
భూతలాత్మన దృష్టి పొలుపుగా నిలిపి
చేతులు జోడించి సీతపల్కెనిట

"సతతమ్ము రామాజ్ఞ నుల్లంఘ నేని
పతిని వైభవమ్ముగా భావింతు నేని
నిత్యమ్ము రాముని సేగొల్తు నేని
ప్రత్యక్షసాక్షిగా పంచభూతములై
ఏ పాప మెఱుగని యిల్లాలి నేని
ఈ పాట్లు దప్పించి యికనైన నాకు
త్రోవజూపవె నేడు కావవే నన్ను
బ్రోవవే నాతల్లి భూదేవి" యనుచు.

ఉల్లమ్ము లగులగా నవ్యాజ యట్లు
తల్లిని ప్రార్థించి తాను వాల్చినది.

జనకజ శోకమ్ము జానకజ మునివి
కనిన దెవ్వడా తాను కినిన దేవుడాడు

ఎవనికై యానాడు శివుని విల్విఱిచి
ఎవనికై రావణున్ బవరాన గెల్చి

ఎవనికై కతఁకొంది యిన్నాళ్ళు తాను
ఎవనినాసించి నేఁడిచటకుఁ బిలిచె
ఆసీత తనభార్య తనకులేకుంట
కనఁబించె శూన్యమై కనులకు జగము
తలపోసి రాముఁడు తనమనోవ్యథలు
నిలువున నీరయి విలపించె నిట్లు.
"రాముని గూరిచి నీమానసమున
ఏమనితలఁచి నీవిట్లు చేసితివి
సౌశీల్యరాశి ! ఓ జానకిదేవి !
ఆశతో రమ్మని అర్థించినాను
మామంచి నీ వొకమాటను జెల్పి
ప్రేమతో నావైపు విచ్చేయుదనుచు
ఆసించి నిన్నట్టు లడిగితిఁ గాని
ఓసీత ! నీమన స్సరయలే నైతి
ఇంతమాత్రమున నీవింతసాహసము
వంతావఁ జేసితే పలువురిముందు.
శ్రీరాముఁ డొకతప్పుగ్గ చేసెనే యనుచు
సైరింపలేవె ఈ స్వల్పమాత్రమును
ఎఱుఁగుదే సీత నీకొఱకు నేనెంత

దాపిల్లి యొంటిగా దుఃఖించనానో
దనుజాఁగు నిన్నటుఁ గొనిపోయి నపుడు
విరుతచారిత్ర నిన్ గనుగొనలేక
విలపించితిని నాఁడు విపినమార్గముల
విలపించెద నయోధ్య వీథిలో నేఁడు
నను వీడి యేఁగితే నాభాగ్యరాశి,
నను నెల్లు మఱచితే నా సీత' యనుచు
ఆననమ్ము వ్రేల్చ నశ్రువుల్ గ్రమ్మ
దీనుఁడై రాముఁడు గిరత వీసి
విలపించె పలుమార్లు తలఁచి జానకిని.
పలుకవే జానకి పలుకవే యనుచు.



## రాముఁడు భూదేవిపై కోపించి బాణ మేయబోవుట

విలపించి రాముఁడు పలుమాఱు లిట్లు
తొలిదుఃఖ మొక్కింత తొలఁగిన యంత
భూపుత్రిపైఁగల మోహభావమ్ము
కోపమ్ముగా మాఱి కుంభినిమీఁద
"అవని రాఘవుఁ డెంత అలుసయి పోయె
అవనిజ నప్పుడా యడవిలో నన్ను

కనుగప్పి యసురుఁడు కొనిపోయినాఁడు,
కనులముందే నేఁడు కొనిపోయె భూమి.
ఈరీతి నవమాన మిలఁబొందఁ బడుచు
భీరువై పడియుండఁ డీరాముఁ డీకను
చెడుతలం పహరిస నెఱవడి రాక
పృథివి యెంతటిది నావంతిఁ గొంపోవ
నాసీత నిటఁ దెచ్చి నాకీయకున్న
ఈసమస్తక్షోణి నేకబాణమున
చూర్ణమ్ముఁ గావించి చూపెద ననుచు
పూర్ణాగ్రహమ్మెద పొంగలుకొన
చాపమ్ము సారించి శరము సంధించి
కోపాన రాముఁడు కొట్టఁబోవంగ,

"ఆగుమో శ్రీరామ! ఆపని నేయకుము
ఆగుము స్వామి దేవ! అఖిలేశ!" యనుచు
పరువున బ్రహ్మాదిసురలరుదెంచి
మొఱవెట్టి రాముని మ్రోంగల నిలచి
"సర్వజగన్నాథ! సర్వమయాత్మ!
సర్వేశ్వరా! రామ! సర్వరక్షకుఁడ!
ఈభూమి యెల్ల నీసృష్టియే కాదె
ఈభూతసంచయ మెల్ల నీయదియె
ఒకసీతకొఱకు నీవుగ్రాగ్ని, ద్రుంప

సకలమ్ము నీకలమై సమయును దేవ !
విశ్వమ్ము నీయందె విలసిల్లుచున్న
విశ్వనాథుండ వీ విపరీత మేల ?
సీతయేగున నీడు చేతమ్ము వీడి
సీతయు నీవును చిరజీవు లవని,
జానకీరాముల సంయోగగాథ
మానితాదర్శమై మహిమీద వెలసి
ఆచంద్రతారార్క మలరును దేవ!
ప్రాచుర్య పావనభాగ్యమై భువికి
వ్రాసియుంచెను మున్ను వాల్మీకిమౌని
భాసురమ్మైన మీపావనచరిత
అమరభాషామృత మ్మాదికావ్యమ్ము
రమణీయ గ్రంథమ్ము రామాయణముగ.
విశ్వసంశ్రేయమై విజ్ఞాన మొసఁగి
శాశ్వతమ్ముగ నిల్చు జగతి నీచరిత
శాంతింపు రామ ! ఈసత్యమ్ము నెల్ల
స్వాంతమ్మునం జూచి చాపమ్ము విడుము
చేకొమ్ము కూర్మి నీ చిన్నబిడ్డలను
చేకొన్న క్రతుపూర్తి చేయుమీ యనఁగ
శాంతించె రాముఁడు చాపమ్ము విడచి
సంతసమందిరి జనులు సంయములు

---

## శ్రీరాముని యజ్ఞసంపూర్తి

చేతమ్ముసందాన సీతను నిల్పి
క్రీడగ దరిఁ జేర్చి బిడ్డలిద్దఱిని
సన్నుతరీతుల శాస్త్రోక్త విధుల
జన్నమ్ము రాముఁడు సంపూర్తిఁ జేసె,
అమరవర్యులు వచ్చి ఆశీస్సలిచ్చి
క్రమముగ హవ్యముల్ గ్రహియించి చనిరి
పదపడి వాల్మీకి బాలురచేత
పఠియించె సభ్యులు ముదమంది వినఁగ
రమణీయమగు తనరామాయణమున
కమనీయ ముత్తరకాండమ్ము నల్ల
సరసత సీపుణ్య చరిత మాలించి
రాముఁడు గైకొని రాజ్యభారమును
అరిగిరెల్లఱురాము ననుభినుతించుచును
భూమినిఁ బాలించె పుణ్యకార్యముగ
భువనసంపూజ్యుఁడు పుణ్యవర్తనుఁడు
రవికులసోముఁ డారామభూవిభుఁడు
తనదేలుబడిలోని జనులశ్రేయమ్ము
తనకిల పరమార్థ మనుచు భావించి
యజ్ఞమ్ము లొనరించె నతిథులఁ దనిపె
విజ్ఞుల సేవించి విబుధులఁ గొల్చె
సలిపె సత్కార్యముల్ సద్గోష్ఠి నెఱపె

విలసితదానములే విప్రుల కిచ్చె
ఎన్నిజేసెయు గాని సెంద రామునికి
ఎన్నిగను గొంటిరియ్యో సవనిజ శేశ
మణిదియా రామునిపోటలనైన
మణివంజాలక తనమదిని జానకిని
బాయరగడుగొంచు సేలోటు సేక
కాలమ్ము యరాం తికిలేగా ౯ డవె

---

## కౌసల్య సుమిత్ర కైకేయుల మరణము

సాదరం దిల్లుగ్గై జనులను గనుచు
మేదినిధర్మము లే సేలుగా నిలిపె
రాజగారామయుడు రాజ్య మేలంగ
రాజగవణాత్తు లారాజను తలను
వాసిగ దశరథపమధేశు సతులు
కౌసల్యయు సుమిత్ర కైకేయి మిగుల
నానంద మందిరి యాత్మల యందు
మానుగ ఫలియించె మ జన్మలనుచు
జానకి తేట్టి సంతపథరము
రానీయకుంపెగ రాము నోదార్చి
బిడుతమన్మలం గని ముద్దాడుకొనుచు
గపుడు మందిరి తనుకాలమ్ము సల్లం

వేలాదియేఁడ్లుగా పృథ్వితమ్ము
నేలిన దశరథు కిల్లాండ్రు వారు
భూమిసుతకుమ్ములా పుత్రులఁ గనిన
వీరమాతలు లేఁకు వృద్ధులైనారు
అకలంకచరితలౌ నాత్మేశుఁ గలియు
ఒకరివెన్క గ నొక్క- ర్యుని వీడి
చనిరి యు మావ్వరున్ స్వర్లోకమునకు
తనయులు సుఖాన మునిగితేలంప



ఖరలుని సుతులు గాంధారపతులగుట

కైకేయి తమ్ముఁడు కేకయనృపతి
సాకేతమున రామచంద్రునిఁ జూచి
వినిపింప గంధర్వు లానరించు ద్రౌష్ట్య
మునిపను గార్గ్యవసన్ మునిచంద్రు నొకని

సింధునదీ తీర సీమలయందు
గంధర్వు లెందఱో గర్వాన వచ్చి
ప్రజలను పీడించి రాజుల నణచి
నిజరాజ్యపదముల నెమ్మి నిల్పించి
విహరించుచుండిరి విచ్చలవిడిగ
మహిమీఁద వారల మదమణగింప

రామ ! నీవే యింక రావలె ననుచు
ఆమాని నుతువగా రాముఁడాలించి
నిరుపమ బలుఁడైన భరతునిఁ బిలచి
"భరతుఁడా గొప్పసైన్యబలముతో నేగి
మనమామ కేకయ మనుజనాథునకు
వినతుల నర్పించి వేగమ్మె యచటి
వైరులఁ బరిమార్చి వారిభూములకు
ధారుణీశులుగ నీతనయు లిద్దరిని
తక్షపుష్కలులను తనరంగ నిలిపి
అతుల్య ధృతిమీఱ నరిగి రమ్మనుచు
భరతుని సుతులకు పట్టమ్ముగట్టి
భరతునితోఁగూడ పంపె రాముండు.

సమరసంరంభుఁడై సైన్యబలమ్ము
సమకూర్చి భరతుఁడు చయ్యన నేగె
మామ్యుఁ డాతని మేనమామయుఁ గూడ
సైన్యమ్ములతో వచ్చి పాయ మొక్కవర్చ
శైలూషుఁ డాదిగా సర్వగంధర్వ
పాలకల్ భరతునిపైకి దండెత్తి
మాయారణమ్మును జేయ నుంకింప
పాతుని ధైర్యాన భరతుఁ డేకొంచి
ఘనమౌ లోత్కృష్టడి వారిపై నడపి

విలసిత భుజబల విక్రమ స్ఫురద
పరిపోవుట కైన దగి కేగుచుండి
దారుణ శరవృష్టి ధారాగా గురిసి
గంధర్వులను గెల్చి కంఠశ గింప
గాంధారరాజ్యాన గడు వైభవముగ
జనులెల్ల హర్షింప తాఁ బురంబులను
వసుశోభలఁ జేసి వసిడి రాఁ గెంచె

---

## శత్రుఘ్నుని కుమారులు మధుపురాధి పతులగుట

అనుచరయుతముగా నసురేంద్రు లవణు
వనిలోన శత్రుఘ్నుఁ డంతమొందించి
బహుళసంపదలతో భాసిల్లు నట్లు
మహనీయరీతిగా మధుపుర మ్మేలి
తన పుత్రులు సుబాహుడును శత్రుఘాతి
యనువారి నిర్వురి నతిముదమ్ముల
మధువిదిశాఖ్యాల మండలమ్ములకు
పృథివీశులఁ జేసి వివిధసైన్యముల
వారికి సమముగా భాగించియిచ్చి
శ్రీరాముసేవింప చిత్తమునందు
కోరిక వాడమగా చేరె నయోధ్య
వీరశేఖరుఁడయి విజయుఁడై తిరిగి.

రావణు సంగతి రాక్షసు లవణు
కావర మ్మడగించె కడక శత్రుఘ్నుఁ
డనిలోన గంధర్వు లందఱిం గెల్చి
చనఁ జెంచె భరతుండు సాహస మ్మెసఁగ
తమ్ముల విజయముల్ తగుకీర్తి పొగడి
సమ్మోదమున రామచంద్రుఁ డుప్పొంగె



## లక్ష్మణుని సుతులు రాజు లగుట

భరతశత్రుఘ్నులు వారిపుత్రులను
పరిపాలకులఁ జేసి వచ్చుట కలరి
విలసితసద్గుణుల్ విక్రమధనులు
లలితస్వరూపులు లక్ష్మణసుతులు
ప్రీతి నంగద చంద్రకేతులఁ గూడ
ఖ్యాతశీలురఁ జేసె నరవి శ్రీరాముఁ
డంగభూమికిని మల్లావనీస్థలికి
మంగళోత్సవ కార్యమహిమ లింపార.

తమవృత్తులకు రాజ్యధర్మముల్ తెలిపి
రమణీయముగ వారు ప్రజ నేలుచుండ
కనుగొని మనముల కడుముద మంది

అనుజులు మువ్వురు ననుసరించి నారు
పరగున సాకేత పురికి శ్రీరాము
చరణసేవయె తమ పరమార్థ మనుచు

---

## బ్రహ్మదేవుని దూతగ యముఁడు రాముని దర్శించుట

ఈరీతిగా కాల మేగుచు నుండ
శ్రీరాముకడ కొకఋషి యేగుదెంచి
"అరుదెంచితిని రామ! త్వరగ నీకొక్క-
పరమరహస్యమున్ వచియించుకొఱకు
మనము మాటాడుచో మనమధ్య కెవరు
చనుదేర రాదట్లు చనుదెంచు వరుని
మరణశిక్షకు నీవు గురిసేయవలయు
మఱి వాగ్దానని మదినెంచఁ గోర
అటులైన చెప్పెద ననఁగ నామౌని,
యటులనే యని రాముఁ డంగీకరించి
దాపున కెవరును తరలిరాకుండ
కాపుంచె ద్వారమ్ము కడను లక్ష్మణుని
ఆకడ కెవ్వరు రాకుండఁ జూచి
యేకాంతమున మునిఇట్లు వచించె.

"పరమేష్టి పంపగా వచ్చితి నయ్యా!
సరగున నొకవార్త సాటింప నీకు
మునినయి యముఁడను మదయున నిటకు,
వినుమయ్య యావార్త విన్నవించెదను.
"నారాయణుండవు శ్రీరామ నీవు
ధారుణీతలమున దైత్యులబాధ
వారింప సురలకు వాగ్దాన మొసఁగి
శ్రీరామమూర్తిగా క్షితినిఁ బుట్టితివి,
రావణుం డాదిగా రాక్షసతతిని
కావర మడఁగించి కడతేర్చినావు,
ధరణీతలమ్మున ధర్మమ్ము నిలిపి
కరుణతో సాధులఁ గాపాడినావు,
ఆదర్శనృపతిగా నవని నేలితివి
ఆదర్శనరునిగా నవని నిల్చితివి,
క్షేమదాయక మయి భూమి నెల్లపుడు
రామరాజ్యము నిల్చు రాజితకీర్తి
పూర్తి చేసితివి నీపుణ్యకార్యమ్ము
కీర్తి కెక్కినది నీవర్తనమ్మెల్ల
చేరెను శ్రీలక్ష్మి సీత యిచ్చటకు
శ్రీరామ నీపాదసేవల కొఱకు
పావనమ్మున నీ వైకుంఠపురికి
వేవేగ నీవిక విచ్చేయవలయు

సిరము చేయుటకు నన్నుఁ గోర్వంగ
నీరాక కొఱకునై నిలిచినా" ననుచు
పరమేష్ఠి పంపిన వార్త శ్రీరామ !
అరుదెంచి నుడివితి" నని యముండు

---

## లక్ష్మణదేవుని ప్రాణత్యాగము

పరమేష్ఠి పంపిన వార్తను విని
మరల రాఘవుఁ డేదో మాటాడుచుండ
వినవచ్చె నాగది వెలుపలి నుండి
ధ్వనియొకఁ డెవ్వరో పలుకుచున్నట్లు

"దశరథ శ్రీరామ ధరణీపాలునకు
నుడువుడు నారాక కడువేగ" యనుచు
మున్కోపి దుర్వాసముని కేకలిడుచు
గ్రక్కున ద్వారమ్ముకడ కేగుదెంచె
అదివిని రభసమ్ము నరసి లక్ష్మణుఁడు
"స్వామి కాలుఁ డొకింత రాముఁడు లోన
మంతనం బొకరితో మాటాడుచుండె
ఇంతలో వచ్చి మిమ్మెఱిఁగించు" ననఁగ
పటుకోపమున రేఁగి పండ్లు దీటించి
బుటబుట లాడుచు దుర్వాసమౌని

"శివుండైన నాకడ్డు చెప్పగ లేడు
ఎవరురా! నీవు ఇన్నిట్టు లాపెదవు?
ఇప్పుడే దుర్వాసుఁ డేతెంచె ననుచు
చెప్పుము రాముతో శీఘ్రమ్ము నీవు
నీ వేగకుండిన నిన్ను శపించి
నీవంశనాశమ్ము గావింతు" ననియె.
ఒకప్రక్క దుర్వాసు నుగ్రకోపమ్ము
ఒకప్రక్క శ్రీరాముఁ డొసఁగిన యాజ్ఞ
ఊరి పెట్టినట్లయి యుల్లమ్మునందు
ఎఱుఁగక తానప్పు డేమిచేయుటయు,
సకలబంధువులను సమయుటకంటె
ఒకఁడు చచ్చుటయె మేలుర్విపై ననుచు
తనుతాళకుండగ వెడలి లక్ష్మణుఁడు
మునిరాక లోనికిం బోయి వచించె
శ్రీరామమూర్తి యున్ ఋషిచంద్రుఁ డున్న
ద్వారంపుతలుపు ను భక్త్యవ తెఱచి
తనుకు లక్ష్మణుఁ డడ్డుతగిలె నటంచు
యముఁ డాగ్రహించి తా నరిగెను మగిడి.

శ్రీరామచంద్రుండు శీఘ్రమ్ము వచ్చి
ద్వారమ్ముకడ నున్న తపసినిఁ జూచి
అతఁ డాకలిగొను టార్తులో నడిగి
అతనిక్షుధ దీర్చి యర్చించి పంపె.

తానేదా మాతనమ్మారి యుంపంగ
ఆనతి లేకుండ లోనికి వచ్చి
శిక్షార్హు డయ్యెను లక్ష్మణుం డనుచు
వీక్షించి రాముండి విషమసంఘటన
ము నివసిష్ఠాదులా ముఖ్యులం బిలచి
వినిపించె కర్తవ్య విమయమ్ము లెల్ల
"ప్రతినకు రారాదు వ్యతిరేక మెప్పుడు
ప్రతినదప్పిన సత్యవచనమ్ము తప్పు
సత్యమ్ము దప్పుట జగతికే ముప్పు
ప్రత్యవాయము ధర్మపాలనమ్మునకు
అనుజునిఁ గాంచు ఈ యపని నూన్యతము
ఘనతరం" మ్మని చెప్పి మును లేగినారు.

కనులముందుగ నున్న కర్తవ్య మరసి
మనమున దుఃఖించి కనలె రాముండు
అలఘువీరుండు ధీరుం డతిసీతి వరుండు
లలితమర్యాదుం డీ లక్ష్మణమూర్తి
అపరాధ మేమియు నవని లేకుండ
విపరీతమీరీతి విధి చేసె ననుచు
స్వాంతమ్మునం దతిసంతాప మంది
చింతానిమగ్నుండై చెడిధైర్యమెల్ల
చిననాంటినుండియు తనతోడు విడక

తనతోడిదే లోకమని విశ్వసించి
తనవెంట వనికి తనయు కేతెంచి
తనకగు బ్రతుకెల్ల త్యాగమ్మొనర్చి
బహువిధ సద్గుణ భాసురుఁ డగుచు
మహిమీద మసలిన మహనీయమూర్తి
తనతమ్ము డిటులయ్యె, తనకని యట్లయ్యె
తనకేమి మిగిలెను ధరణియం దనుచు
గతిలేని మనుజుని కరణి దుఃఖించె
ధృతియెల్లఁ దూలిన రీతి రాముఁడు.

అన్నగారి విచార మరసి లక్ష్మణుఁడు
అన్నపాదము లంటి యంజలి బట్టి
"సోదరుఁ డనుచును చూడ కోరాదు!
నీధర్మమును నీవు నెఱవేర్పు మయ్య
నీయానతిని మీఱి నీముదుముండ
చేయగూడని పని చేసితి నేను
ఈయస్థిపంజర మేమైనఁ గాని
నాయాత్మ శ్రీరామ! నీయందె నిలుచు
కరుణయేటికి ధర్మకార్యమ్ము లందు
వరమునీశ్వరు లెల్ల వాక్రుచ్చినటుల
రక్షింపు ప్రతినను రామ నన్నింక
శిక్షింపు" మనుచును శిరము వంచె

తమ్ముని శీలమ్ము తమ్ముని భక్తి
తమ్ముని నీతియు తనమది మెచ్చి
"ఎంతసద్గుణమూర్తి వెంతధీరుడవు
ఎంతికునమ్మిన దిలను నీకాగ
మున్నలక్ష్మణ!" యంచు నాదర మ్మెసగ
కన్నీరు గార్చుచు కౌగిటం బూని
వగచుచు తాజేయు పనికి నొక్కింత
తెగువకో లక్ష్మణుం డిరిచి రాముండు
పుడమి సర్వాగ్నినైన పొమ్ము నీవనుచు
విపనాడటయుగూడ కడకుచంపుటయె
అని యూత్మలో నెంచి అనుపయ మ్మెసగ
అనఘని దిక్కయి యనియె సీతకి
సన్నుతిసద్గుణ చిన్నతమ్ముండ
మన్నించుమయ్య నామాటకు నిలిచి
చేసెత నిన్నిప్పు శిక్షింపవలసె
చేసినదేమి నీదోసమ్ము లేక
శశ్వదాదర్శమై జగతిని నిలుచు
శాశ్వతమ్ముగ నీదు సచ్చరిత్రమ్ము
వినుము లక్ష్మణుండ ఈ పృథ్విని నాదు
కనులకు నీవింక కనుపడరాదు
వినవాడు దుంటిని విధిలేక నిన్ను
పుడమి నెచ్చటికైన పొమ్మని పలికె.

## లక్ష్మణదేవుని మహాప్రస్థానము

రాముఁడు లేనట్టి రాజ్యమ్ము దేల
రాముని చూడని ప్రాణమ్ము దేల
ఒక్కటే గమ్యమిా యుర్వి లక్ష్మణున
కొక్కటే లక్ష్యమ్ము ఒక్కటే దారి
నారాయణుఁడు జగత్కారణుండైన
శ్రీరామమూర్తినే చిత్తాన నిలిపి
అచటి వార్లెల్ల నశ్రువుల్ నింప
అచలధీయుండయి యరిగి లక్ష్మణుఁడు
భానుకోటి సమాన భాసురతేజ
మానసమ్మున వెల్గ నద్భుతరీతి
నిరుపమనిజయోగ నిష్ఠను బూని
సరయూతరంగిణీ జలముల మునిగె
అరుదెంచుచున్నది శేషాంశ యనుచు
సురలెల్ల సాష్టాంగ మొక్కిరా వేళ.
దేవేంద్రుఁ డేతెంచి దివ్యవిమాన
పావనపీఠాన పవళింపఁ జేసి
తనువుతో లక్ష్మణుం గొనిపోయె దివికి
వినువీథులను నిల్చి విబుధు లర్చింప.

దేవతలందఱు దివిపైన తనకుఁ
గావించు పూజలఁ గైకొని వేగ
స్థిరతరాత్మప్రభా తేజస్వి యగుచు
పరమపదమ్మున కరిగె లక్ష్మణుఁడు
ఆదిశేషునిరూప మమరంగఁదాల్చి
శ్రీదేవి విష్ణుల సేవించు కొఱకు
పతి లక్ష్మణుని మహాప్రస్థానవార్త
సతిధీరచిత్తయై యాలించి లేచి
పరమపదమ్మున పతిఁజేరుకొఱకు
సురుచిరాత్మజ్ఞాన శోభిత యగుచు
యోగసమాధిలో నూర్మిళాదేవి
వేగఁ బ్రవేశించి వీడఁ బ్రాణములు.

---

## కుశ లవుల పట్టాభిషేకము

పరమేష్ఠి పంపిన వార్తయే మరల
మరల శ్రీరాముని మదిలోన మెదలె
తనలక్ష్మణునిఁ బాసి క్షణమేని యుఁడ
మనలేని భావమ్ము మనసులోఁ దోచ
భరతున కిల రాజ్యపట్టమ్ముఁ గట్టి
ధరణిఁ ద్యజించి తా నరుగఁ దలంచె
భరతుఁడు వేగ యావార్త నాలించి

కరుణింపుఁ డని రామచరణమ్ము లంటి
“శ్రీరామ ! మీపాదసేవయే కాని
ఈరాజ్యభోగమ్ము లేనొల్ల” ననియె
ధాత్రిని రాముఁడే తనకు సర్వముగ
శత్రుఘ్నుఁడును వేగ చనుదెంచి నుడివె.

తిరుగులే దాతని తీవ్రభావమున
మఱుగులే దాతని మానసమ్మందు
రాముఁడు వేగమే రాజ్యమ్ము వదలి
భూమిని వీడెడి నీమమ్ము నెఱిఁగి
వచ్చిరి బంధువుల్ వచ్చిరి మునులు
వచ్చి రమాత్యులు వచ్చిరి ప్రజలు
శ్రీరామచంద్రుని చేరి కొల్చుచును
బారులై వారిట్లు ప్రార్థించినారు

“కార్యదక్షులు రాము ! కమనీయగుణులు
ధైర్యబలోన్నతుల్ ధర్మతత్పరులు,
వీరాధివీరులు శ్రీరామచంద్ర !
భూరిసాహసులు నీపుత్రు లిద్దఱును
వాసిగా వారికి పట్టముల్ గట్ట
కోసలప్రజలయొక్క కోరిక” యనిరి.

గురువులు నుగ్రులు బలముఖ్యు లెల్ల
పరమహర్షమ్మున బాల్గొద్దజేని,
"ప్రవిమలకీర్తితో బ్రాభవ మ్మొసగ
నవని నేలుఁ" డటంచు నాశీస్సు లిడిరి

వనమున మన్నించి జనులకోర్కెలను
మునులయామోదమ్ము ను నుతుండు బడసి
సమముగా భాగించి సర్వలోకలను
సముచిత శాస్త్రోక్త సరణి రాముండు
లలితసద్గుణులైన లవకుశాఖ్యులకు
చెలువొప్ప పట్టాభిషేక మ్మొనర్చి
సురుచిర సామ్రాజ్యశోభ దలిర్ప
చెఱియొక భాగమా యిరువురి కిచ్చి,
మానితవర్తనల్ మహనీయగుణులు
జానకీరాముల సూనులు వారు,
ధీరులై పెద్దలదీవనల్ వడసి
వారివారల రాజ్యభాగమ్ము లందు
భూమిజనుఁ బాలింప పుణ్యకార్యముగ
ఆమోదహర్షమ్ము లంది రెల్లరును,
రామునివంశమ్ము రాజిలరీతి
భూమిని వర్ధిల్ల పొలుపు లేపారె.

---

## బంధుమిత్రులకు రాముని వీడ్కోలు

తనకార్యభారమ్ము ధరణిపై ముగిసె
తనకొఱకు వికుంఠధామమ్ము నందు
వేగవచ్చు నటంచు వేచియున్నారు
భాగవతోత్తముల్ భక్తు లెల్లరును,
మానవవర్తన మాటయే లేక
ధ్యానమగ్నము లైన తలంపులతోడ
బలమైన యొకదివ్య భావసమాధి
నిలిచెను రాముని నెమ్మది యెల్ల
కడంగి రాముని యూర్ధ్వగమనాభిలాష
పుడమిసర్వము పాలికి పూజ్యమై యలరె.
చేరి బంధువుల్ స్నేహితు లెల్ల
శ్రీరాముపాదముల్ సేవించుకొఱకు,
వచ్చె సుగ్రీవుండున్ వానరవరులు
వచ్చెను లంకాధిపతి విభీషణుండు
పౌరులెల్లరు వచ్చి భక్తితోనిలచి
బారులుతీర్చి రా పట్టణమ్మందు
అందఱు శ్రీరాము నర్చించువారె
అందఱు రాముతో నరిగెడువారె.
ఏమాట నెవ్వరి కెటుచెప్పవలెనో
ఆమాట శ్రీరాముఁ డరసి వచించు,

పిలచి విభీషణున్ ప్రీతితో దంకి
“నిలిపి నీధర్మమ్ము నీతియు పేర్మి
లాలితసగరమ్ము లంకాపురమ్ము
పాలింపు మనుచ నను పంపె రాముండు,
మైంద ద్వివిదు లమృతాంధస్సు లగుట
ఉందరు చిరకాల ముర్విపై నసయి
గనకార్యకృత భక్తితన్మయత్వమున
వినయుఁడై యున్నట్టి హనుమంతుఁ జూచి
చిఱునవ్వు నవ్వుచు శ్రీరాముఁ డనియె
“పరమభక్తాగ్రణీ! పావనీ! నీవు
వేదాంతమూర్తివి విజ్ఞాననిధివి
కదిని తులలేని మేటివీరుఁడవు
పరమనిష్ఠాన్విత బ్రహ్మచర్యుఁడవు
పరమేష్ఠి వగుదువు భావికాలమున
ఇలపైన నాపేరు నిలచునందాఁక
చెలువుగ నీవును చిరజీవివగుచు
ఆసర్వకాల మోహనుమంత నీవు
భాసురయశములో వరలుదు” వనియె

పౌరులన్ బంధుల పరివారములను
కూరిమితోఁ జూచి కళలమ్ము లడిగి
చిరసౌఖ్యములఁగల్గి జీవింపుఁ డనుచు

కరుణతోఁ దనశుభ కాంతులఁ జెలిపె
మునులున్నచోటికి వినయుఁడై యేగి
మునుకొని భక్తితోఁ బ్రొక్కి పూజించి
పరమేష్ఠిగముఁడును పంచపూజ్యుండు
ధరణిని తనకులగురువుగా నుండి
తమవంశకీర్తికి తమక్షేమమునకు
తమప్రాభవమునకుఁ దగుబాసటైన
మునివసిష్ఠుని పాదవనజమ్ము లంటి
వినయుఁడై సాష్టాంగప్రణతు లర్పించి
మఱునాఁడె దివికిఁ దా నరిగెద ననుచు
నెఱిఁగించె రాముఁడు స్థిరభావముల

ఆ మునిచంద్రుఁడు వార్తలోఁ దెలియు
రాముని చిత్తమం దేమియున్నదియో
ఎఱిఁగించి మునీంద్రవరుల కీవార్త
నరగున తత్కార్యసంరంభుఁ డగుచు
రామచంద్రుని మహాప్రస్థానవిహిత
హోమాదులను సిద్ధ మొనరించె వేగ.

---

## శ్రీరాముడు వైకుంఠమునకు వేంచేయుట

ఉడుపీథి గ్రహరాజి యుచ్చమై వెలిగి
గడియ లొక్కొక్కటి పుణ్యమ్మై గడచి

ప్రవిమలమ్ముగ వచ్చె రామచంద్రుండు
భువిపీఠి దివికేగు పుణ్యకాలమ్ము

ధరియించి వ్రేళుల దర్భాంకురములు
ధరియించి మేనున ధవళాంబరములు
ఆలోకనము నాసికాగ్రాన నిలిపి
నీలకేశమ్ములు వ్రేలాడ పైచి
ఆననమ్మున ధ్యానమౌనమ్ము లెసఁగ
మానితకాంతుఁడు మహితతేజస్వి
రాజగృహము వీడి రాముఁడు వెడలె
భూజను లెల్లరు జేజేలు వెట్ట
భరతశత్రుఘ్నులు భార్యలతోడ
నరుదెంచి నిలిచిరి యిరుగడ లందు
శమ దమ నియమాది సద్గుణచయము
విమలవివేకమ్ము విజయలక్ష్మియును
దాక్షిణ్యకారుణ్య ధైర్య శౌర్యమ్ము
లక్షీణ జపతప స్వాధ్యాయవిధులు
శాస్త్రాగమాజ్ఞల సద్విశేషములు
శస్త్రాస్త్ర కార్ముక చటులశక్తులును
ప్రవిమలోప నిషత్ప్రభాసార మహిమ
వివిధ పూజామంత్ర బీజమాలములు
ఏకతేజోరూప మురఁగిన పగిది

ప్రాకటోజ్జ్వల కాంతివాహినిగాగఁ
రామునివెంబడి రమ్యోత్సవముగ
కామితాకృతులతో కదలివచ్చినవి
సురచిర శ్రీరూప సుందరాకృతుల
పురలక్ష్మి యేకాంత వరుడౌచు హ్రీంకు
ఛందోఋషిన్యాససన్మంత్రప్రణవ
సౌందర్యరూపయై సావిత్రి వచ్చె

గురువులు సచివులు పురజనుల్ మాను
లుకడించి రోకపెండ్లి కరిగెడురీతి
పశు పక్షి మృగ కీట ప్రాణిసంతతులు
విశదహార్దమ్మున వెంబడించినవి
భూమిసమస్తమ్ము రామునితోడ
సామోదముగ గూడి సాగినట్లయ్యె
ఆరీతి సరయువు తీరమ్ము దరికి
శ్రీరాముఁ డల్లన చేరునప్పుఁ॥
పరమేష్ఠి యాదిగా సురవరు లెల్ల
కరుడెంచి కట రాము నర్చించుకొనుటకు.

వినవచ్చె నాకవాణి వినువీథి నంత
జనులెల్ల రాశ్చర్యచకితులై వినఁగ

"శ్రీరామ! రఘురామ! శ్రీపరంధామ!
ధీరగుణాకార ! దివ్యావతార !
సకలలోకాధార ! సాధువిచార !
ప్రకటితబలసార ! పాపసంహార !
చాలించి నీ మానుషాకార మిలను
ఏలగా రావయ్య యెల్లలోకములు
సురుచిర వైభవ సుందరమైన
గరుడవాహన మెక్కి కదలిరావయ్య
ఆగేల వైకుంఠసామ్రాజ్యమునకు
వేగరావయ్య శ్రీవిష్ణుస్వరూప !
శ్రీరామ సీతయు చేరియుచ్చోట
సీతాకళంకయి నిలిచిన" దనగ
చెవుల సోకినయంత సీతనామమ్ము
ప్రవిమలహృద్యాన భూమియుప్పొంగ,
అరుదేర తనవెంట ననుగూడమ్ములును
సంగున రామునకు సంయుక్తి జొచ్చి
సుతసుందంబును విశ్వమోహనము
తనదివ్యరూపమ్ము గలఁచె నమ్మదిని.

ఒక నిముసమ్ములో నున్నటు లుండి
సకల దిగ్వ్యాప్త మౌ సందీప్తి తోడ
మణికిరీటమ్మును కనక చేలములు

మిసుత కౌస్తుభరత్న కమలహారమ్ము
రాజిత శ్రీవత్స రమ్యలాంఛనము
వైజయంతీమాల వగలు వక్షమ్ము
చక్రమ్ము శంఖమ్ము శార్ఙ్గ పద్మాది
విక్రమచిహ్నముల్ వెలయు హస్తములు
సుగుణాలవాలమ్ము సురుచిరోజ్జ్వలము
జగదేకరమ్యమ్ము శ్యామసుందరము
భానుకోటిప్రభా భాస్వత్ప్రకాశ
మానవమ్మున వెల్గు హరిరూపమచట
లోచనోత్సవముగా చూచువారలకు
గోచరించెను కాంతికోమలమ్ముగను
భరతశత్రుఘ్నుల భవ్యతేజమ్ము
లరిగి లీనములయ్యె నారూపమందు

శ్రీహరిన్ దేవతల్ త్రిదివాసులెల్ల
పాహి, పాహి ! యటంచుఁ బ్రార్థించినారు.
అతిభక్తి శ్రీరాము నడుగుజాడలన
కృతనిశ్చయమ్ముల నెందఱోజనులు
ధరణిని తమకిదే పరమార్థమనుచు
సరయూనదినిఁ జేరి యరిగిరా వెనుక
వాసిగా వారికి బ్రహ్మకల్పించె
భాసురధామమ్ము స్వర్గవాసమ్ము

సరయూనదీ దివ్యజలముల మునిఁగి
యరిగెను సుగ్రీవుఁ డగ్ర్యునిఁ జేర
అమరశిల్పిని నలుఁ డాప్తుని నీలు
డమలాత్మ్కులై చేరి రటులనే వేగ
ఏ దేవతాంశల నలరు వహించి
మేదినిపై జన్మ మెత్తిరో మరల
పూనిరి వారల పూర్వరూపములు
వానరు లెల్లరా వాహిని మునిఁగి.

ధరణికి నంతలో నరుదెంచి నిలచె
పరమాద్భుతమ్ముగా గరుడవాహనము
దేవత లనుచరుల్ దిక్పాలవరులు
సేవించు చిరుగడ చేరి నివ్వెంగ
గరుడవాహన మెక్కి కమనీయగతుల
నరిగె నారాయణుఁ డభ్రవీథులకు.

ప్రవిమలభక్తితో దివిజ డానర్చ
వివిధపూజావిధుల్ ప్రీతిగాఁ గొనుచు
తుములమ్ముగా దేవదుందుభుల్ మ్రోయ
విమలసుందరముగా విరివాన గురియ
పరమభాగవతులు పార్శ్వానుచరులు
సురలును దేవర్షివరులును చేరి

శ్యామలాకారా ! శ్రీరామావతార !
క్షేమంకరా ! సర్వజీవనాధార !
సర్వజగన్మాన్య ! సర్వశరణ్య
సర్వేశ్వరా! యని స్వాగతమిమ్మాయ
వాసుదేవుడు చేరె వైకుంఠపురము
భాసురమ్మగు తన భవ్యవాసమ్ము.
వైష్ణవీయువతులు వచ్చి హారతులు
విష్ణుకీర్తనం జేసి వేడ్క నీయంగ
శ్రీకాంతస్వయముగా చేయూత నిచ్చి
శ్రీకాంతుఁ జేర్చెను శేషతల్పము న.



## వైకుంఠమహిమ

శ్రీదేవి విష్ణువు శ్రీకరాకృతులు
వేదాంతవేద్యులు విశ్వరూపులును
విశ్వకర్తలు వారు విశ్వపాలకులు
విశ్వసంరక్షకుల్ విశ్వాత్మకులును.
లోకకల్యాణైక లోలాత్ములమల
వైకుంఠవాసులు వాత్సల్యనిధులు.
పూర్ణసౌందర్యమ్ము పుణ్యధుర్యమ్ము
వర్ణనాతీత మా వైకుంఠమహిమ
సత్యమ్ము శాంతమ్ము సత్వాతిశయము

నిత్యమ్ము నిగ్గౌ వ్యాత్యంతవిధవ
మహిమాత్మానద మాధ్యాత్మికమ్ము
మోక్షనిధానము మాత్తా కయమ్ము
భాగవతోత్తము భవ్యజన్ములకు
ఆగమోత్తుల కాశ్రయ మ్మదియె.

---

## ఫ ల శ్రు తి

పరమేష్ఠి భారతి, భర్గుండు పార్వతియు,
సురలును మునులును లంకెంచి యటకు
విష్ణు చరితమ్ము విష్ణునిమహిమ
విష్ణులీలలు వేడ్క కీర్తించి
"సర్వచరాచర జగతి కెల్లనల
సర్వసౌఖ్యములిచ్చి సంతోష మిచ్చి
నీ సత్కృపాశక్తి నిత్యమై యలరి"
భాసిల్లుగాకంచు వాంఛించి చనిరి
జానకీరాముల చరితమ్ము నందు
మానితోత్తరభాగ మహిత మీగాథ,
సముధిక మాధుర్య సాహిత్య సార
రమణీయ ముత్తర రామాయణమ్ము
చదివిన వినినను జనుల కెల్లరకు
సదములోన్నతిభాగ్య సంపత్కరమ్ము.

## గద్యము

ఇది శ్రీ భారతీ కరుణాకటాక్షలబ్ధ కవితావిశేష హారితసగోత్ర
పవిత్ర రత్నమాంబ నర్రాజార్యపుత్ర కవిశేఖర
కవిభూషణ బిరుదాంచిత సుజనవిధేయ సుబ్బారాయ
నామధేయ ప్రణీతంబైన శ్రీఉత్తరరామాయణకథ
సర్వము సంపూర్ణము
ఓమ్ తత్ సత్.



# శ్రీ కొండేపూడి సుబ్బారావు రచనలు

## ముద్రితములు

1 కావ్యాంజలి క్రౌను 16+32 పుటలు వెల రు 3-50
రమణీయ ఖండకావ్య సంపుటి

2 గీతామృతము డెమీ 36+328 పుటలు 15-00
18 అధ్యా శ్లోకములు వానికి సులభశైలి
తెలుగు పద్యములు, తాత్పర్యములు

3 గీతాసంగ్రహము డెమీ 48 పుటలు 2-00
భగవద్గీత 18 అధ్యా సారము వచనము

4 సర్వేశ్వరస్తవము డెమ్మీ 32 పుటలు 1-50
ప్రార్థన పద్యశతకము

5 శ్రీవేంకటేశ్వరకర్ణామృతము క్రౌను 72 పుటలు
పద్యకావ్యము 4-00

6 శ్రీ సూర్యనారాయణశతకము క్రౌను
36 పుటలు 2-00

## సులభశైలి ద్విపదకావ్యములు

7 శ్రీమద్రామాయణము క్రౌ 24+300 రు 12-00

8 శ్రీ ఉత్తరరామాయణము క్రౌ 16+128 5-00

9 శ్రీమహాభారతము క్రౌ 16+142 5-00

10 శ్రీమద్భాగవతము క్రౌ 16+312 12-00

మొత్తముగా కొనువారికి ప్రతులసంఖ్యనుబట్టి
తగిన డిస్కౌంటు లభించును